శ్రీ



# సర్వేశ్వరస్తవము

(భక్తిరస బంధురములు, ఆధ్యాత్మికాశ్రయములు,

వైరాగ్య భావవిలసితములు అగు పద్యములు)






కృతికర్త

కవిశేఖర కొండేపూడి సుబ్బారావు

షష్టిపూర్తి ప్రచురణ

# శ్రీ సర్వేశ్వర స్తవము

(భక్తిరస బంధురములు, ఆధ్యాత్మికాశ్రయములు
వైరాగ్యభావవిలసితములు నగు పద్యములు)



కృతికర్త
కవిశేఖర కొండేపూడి సుబ్బారావు

అన్నిహక్కులు గ్రంథకర్తవి
మొదటి ప్రచురణ 1000 ప్రతులు
పింగళ నామ సం॥ర చైత్రము.
ఏప్రిల్ 1977

ప్రాప్తి స్థానము
గ్రంథకర్త
47-10-5 ద్వారకానగరు
విశాఖపట్టణము-16

వెల రు 1-50

ఈ గ్రంథ ముద్రణకవసరమగు కాగితము ప్రభుత్వము వారినుండి ప్రత్యేక తగ్గింపు ధరకు లభించినది. వారికి అనేక కృతజ్ఞతలు.

# వి జ్ఞ ప్తి

శ్రీ సర్వేశ్వరుని సంబోధించుచు అన్ని పద్యములందును 'సర్వేశ్వరా' అను మకుటముతో వ్రాసిన కావ్యమిది. మా నాన్నగారి పేరు సర్రాజు. సర్వేశ్వరుఁడను పదమే కాలక్రమమున వ్యవహారములో సర్రాజుగా మాఱినదని నా తలఁపు. 'సర్వేశ్వరా' యను మకుటము నెంచుకొనుట కిది ముఖ్యకారణము.

ఈ మధ్యనే శ్రీమద్భగవద్గీత సర్వమును తెలుగు పద్య తాత్పర్యములలోని కనువదించి గీతాచార్యుఁడగు శ్రీ కృష్ణ పరమాత్మకు సమర్పించితిని.

మా నాన్నగారు స్వర్గతులై ఏబదేండ్లు దాటినది. మా అమ్మగారిటీవలనే పరమపదించిరి. ఈ కావ్యమును వారి పవిత్ర సంస్మృతికి భక్తి పూర్వకముగ నంకిత మొనర్చు చున్నాను. సంతానముయొక్క యోగ క్షేమముల కొఱకు తల్లి దండ్రులొనర్చు సేవాత్యాగము లనూహ్యములు. మా తల్లిదండ్రుల కీ సమర్పణము చంద్రునికొక నూలుపోగు వంటిదే. వారి రూప చిత్రముల నిందు పొందుపరుప నెంచితినిగాని మా అమ్మగారి రూప చిత్రమే ఉన్నది, మా నాన్నగారి చేవ్రాలు మాత్రము లభించినది. వానినే యిందుఁ జేర్చితిని.

విశ్వరక్షకుఁడు సర్వేశ్వరుఁడు నగు మహాప్రభువును ఏ నామముతో స్మరించి పూజించినను భవసంతరణ మార్గమే. ఆ సర్వేశ్వరునకు ఆత్మార్పణ పూర్వకముగను, ఆధ్యాత్మిక చింతనానుసారముగను వ్రాసినవే ఈ కావ్యము నందున్న పద్యములలో నెక్కువ భాగము. ప్రాసంగికముగ సందర్భశుద్ధిని బట్టి కొన్ని యితరములను జేర్చి, వేర్వేఱు శీర్షికలుగా విభజించి, నాకు తోచిన క్రమ ములో కూర్చి దైవ ప్రార్థనతో మొదలిడి శుభమస్తు అనిన శీర్షికతో ముగించితిని.

ఒక విధముగా దీనిని సర్వేశ్వర శతకమనియే అనవచ్చును. ఆంధ్ర వాఙ్మయమున అత్యాదరము పొంది విరివిగా సాగిన సాహిత్య ప్రక్రియ శతకము. సాధారణముగా స్వవిషయమో, దైవస్తోత్రమో, నీతివాక్య రచనమో, సమాజమందలి దోషముల నెత్తిచూపుటయో మున్నగు విషయములే శతక రూప

మున వచ్చుచున్నవి. ముఖ్యముగ నిటీవలి కవులందరు ఏప్పుడో యొకప్పు డేదో యొక శతకమును వ్రాసియుందు రనియే నా తలపు.

శతకరచనమున కష్ట సుఖములు రెండును కలవు. వస్తు సంవరణమున వైవిధ్యము లేకపోవుట ఒక సౌలభ్యము; ఒకే భావముతో అనేక పద్యములలో పఠితలను సమాకృష్టులను చేయగలుగు కవితా నైపుణి ప్రదర్శించుట ఒక కష్టము. భక్తి విషయమునందే గాక సాహిత్యపరముగ కూడ స్తుతిపాత్రములై ప్రసిద్ధి కెక్కిన శతకములు తెనుఁగున చాల యున్నవి. ధూర్జటి కాళహస్తీశ్వర శతకము, గోపన్న దాశరథి శతకము, వ.సు. రాయని భక్త చింతామణి శతకము మొదలైన విట్టివే. సర్వేశ్వర శతక మొకటి ఈ వఱకే పూర్వాంధ్రకవి యథావాక్కుల అన్నమయ్యచే విరచితమైన కావ్యమున్నది. ఈయన సుమారు పన్నెండవ శతాబ్దము నాఁటి ప్రసిద్ధ కవి.

సాంప్రదాయకముగ శతకమున అష్టోత్తర శత పద్యముల జేర్చుట పరిపాటి. ఈ కావ్యమున అంతకన్నను ఎక్కువగనే చేరినవి. ఎప్పుడైన నేమి సర్వేశ్వరా అను సంబోధనతో నేను వ్రాసిన పద్యములెన్నో యున్నవి. కొన్నిటినే ఇందు జేర్చితిని.

ఇందున్న పద్యముల విషయమై ఒక మాట. కొన్ని శీర్షికలు సంస్కృత భాషాపదములలో నున్నవి. అవి యన్నియు ప్రసిద్ధములైన వాక్యములే గదా యని అట్లుంచితిని. 'స్వర్గాదపి గరీయసీ' మన జన్మభూమి యగు భారతదేశ ప్రశంస. 'నిర్వేదము' 'సాధన' 'తత్త్వమసి' 'ఏమందువు' అనునవి ముఖ్యముగ ఆత్మార్పణ పూర్వకమైన పద్యములు. 'గీతాదేశమున' శ్రీమద్భగవద్గీత యందలి పదునెన్మిది అధ్యాయముల కేంద్ర భావము లున్నవి 'సంభవామి యుగే యుగే' అను పద్యములు శ్రీ విష్ణువుయొక్క దశావతార వర్ణన. 'శ్రుతి సూక్తుల'లోని పద్యములకు ప్రసిద్ధములైన కొన్ని వేదోపనిషత్తుల వాక్యము లాధారములు.

ఈ పద్యములు పాఠకుల మనస్సులలో ఏమాత్ర మాధ్యాత్మిక చింతనను కలుగజేసినను నా యత్నము సార్థకమే.

ఇందలి పద్యశైలి, కవితానైపుణి పాఠకులే గ్రహింపగలరు.

విశాఖపట్టణము,
16–4–77.

గ్రంథకర్త.

ఓమ్

మాతృదేవోభవ, పితృదేవోభవ.

## కృతి సమర్పణము

ప్రేమ మూర్తులు, స్వర్గతులు, చిరస్మరణీయులైన
మా తల్లిదండ్రులకు
హృదయపూర్వక భక్తి బద్ధాంజలినై ఈ కృతిని
సమర్పించుచున్నాను.

మా నాన్న

కొండేపూడి సర్రాజు గారు



మా అమ్మ

కొండేపూడి రత్నమ్మ గారు

జన్మం బిచ్చినదే మొదల్ మధుర వాత్సల్యమ్ముతో సాకి, ప్రే
మోన్మేషం బలరార పెంచిన మహాత్ముల్, దైవరూపమ్ము ల
స్మన్మాతాపితలార! నా హృదయ సంస్థానమ్మున న్నిల్పుచున్
సన్మానింతును మిమ్ము మీస్మరణ పూజాజీవి దీవింపుడా.

# వి ష య సూ చి క





# ప్రార్థన

## విఘ్నేశ్వరుఁడు

శ్రీ రమ్యమ్ముగ ధర్మసమ్మతముగా శ్రేయోనిధాన ప్రభా
పారమ్యమ్ముగ శాంతిసీమగ భువిన్ భాసిల్లఁగాఁజేసి, స
ర్వారంభమ్ములనున్ జయప్రద మొనర్పంజాలు లోకేశుఁ డా
హేరంబున్ దృఢ భక్తి భావములతో హృద్వీధి నర్చించెదన్

## సరస్వతి

వీణానిక్వణ కావ్యగానకళ లుద్వేలంబులై యొప్ప, లో
కానంద మ్మొనగూర్చుచున్ సకల విద్యారాజ్ఞియై వెల్గు నా
జ్ఞానశ్రీ రసమూర్తి భారతికి సాష్టాంగమ్ముగా మ్రొక్కి, స
మ్మానింతున్ మది పల్కుతోడయి ననున్ మన్నించి దీవింపగా.

## సంస్కృత కవులు

ఆవాల్మీకియు వ్యాసమౌనియును కావ్యానంద లోలాత్మ తే
యావేశమ్మున లోకసంగ్రహ కళా వ్యాసక్తితో దివ్యగా
థా వైదుష్యము లిచ్చిరో ప్రజలకున్ తద్భావనోద్వేగమున్
సేవాసక్తి భజించి, వాఙ్మయ మధుశ్రీలేశ మర్థించెదన్

## తెలుగు కవులు

పలుకుంబల్కున తీయతేనియలు జాల్వారంగ కావ్యామృత
మ్ములు వర్షించిన సాహితీప్రభువు లా పోతన్నయున్ నన్నయా
దులు శ్రీనాథుఁడు తిక్కనాది కవిచంద్రుల్ మద్గురుస్థానముల్
తలఁతున్ వారి పదాంబుజమ్ములు కవిత్వశ్రీ కళాభ్యర్థినై.

## రసజ్ఞులు

సరవిన్ లోక హితార్థసాధనముగా సర్వేశ్వరోపాసనన్
పరమార్థమ్ముగ మోక్షరాజ్యపదవీభాగ్యమ్ముగా నెంచి, భ
క్తి రసావేశమునన్ లిఖించిన మృదూక్తిస్నిగ్ధ మీ కావ్యమున్
సరసుల్ మెత్తు రటంచు నెంతు మదిలో ఛందోమయానందమున్.

# పరమాత్మ

శ్రీకారమ్ము లిఖించి సర్వజనతా క్షేమంకరంబైన నీ
యాకారమ్మున భక్తి పూర్ణమనన ధ్యానమ్ముతో మన్మనః
ప్రాకారమ్మున నిల్పి దీక్షమెయి నీపై కావ్యనిర్మాణమున్
చేకొంటిన్ దయసేయుమయ్య భవదాశీర్భిక్ష సర్వేశ్వరా !

శ్రీమత్పుణ్యకథా విభాసురము, రాశీభూత కారుణ్య రే
ఖామానోజ్ఞము, నిత్యనూతనకళా కళ్యాణ, మాధ్యాత్మ శో
భా ముద్రాంకిత రూపసుందరము, సర్వప్రాణిలోకావన
శ్రీముక్తిప్రదమౌ, వెలుం గనుచు నిన్ సేవింతు సర్వేశ్వరా !

చేతోద్యోతక, మాద్య, మవ్యయము, సత్ చిత్ దివ్యసౌందర్య రే
ఖాతత్త్వమ్ము, సనాతన. మ్మఖిలలోకాధార, మవ్యక్తమౌ
చైతన్యస్ఫురణమ్ము, సత్త్వగుణసంస్థానమ్ము, త్రయ్యర్థవి
ద్యాతాత్పర్యము. బ్రాహ్మ్యతేజ మని నిన్. ధ్యానింతు సర్వేశ్వరా !

అదిసత్యం, బదినిత్య, మవ్యయము, సర్వాంతర్బహిర్వ్యాప్త మ
య్యది సృష్టిస్థితి నాశకారణము, దేహమ్మందు జీవాత్మగా
పడిలమ్మైన మహామహస్సది, పరబ్రహ్మమ్ము, విశ్వాత్మక,
మ్మది విశ్వాయతనమ్ము నీవ యనుచుం బ్రార్థింతు సర్వేశ్వరా !

చేతస్సంస్మరణీయ తత్త్వము శిరస్సేవ్యంబు నీరూప మే
రీతిన్ పోల్చగనౌను ? పూరుషుడవో స్త్రీవో మఱింకేదొ, ఈ
హౌతితమ్మగు లోకరక్షణ కళా వ్యాసక్త దీవ్యత్పరం
జ్యోతిర్మూర్తి వటంచు చేసెదను సంస్తోత్రమ్ము సర్వేశ్వరా !

# ఏకమేవాఽద్వితీయమ్

శివుఁ డంచున్ నుతియించుచుందురు శిరస్సేవ్యంబుగా నెంచి, కే
శవుఁ డంచున్ భజియింతు కొందఱిక శశ్వద్భక్తితో నిన్ను ని
ష్ఠైవరే పేరున పిల్చి కొల్చినను ఏయేరీతి పూజించినన్
అవనిన్ నిన్నె భజించి నట్లగును కాదా, దేవ, సర్వేశ్వరా !

బ్రతుకుంబాటలు జీవనక్రమములున్ భాషల్ మనోభావముల్
మతముల్ జాతులు నీతులంచు బహుధా మార్గంబులం బోదు రీ
క్షితిపై మానవు లేనో, తెలియ రీ చేతమ్ములన్ లోకసం
తతి కెల్లన్ గతి నీ వొకండ వని చిత్రమ్మిద్ది సర్వేశ్వరా !

లోకమ్ముల్ సృజియించి పెంచగల శుశ్లోకుండు దేవుం డతం
డేకాకారుఁ డటం చెఱుంగుదుము కానీ, నీదు నామంబు లె
న్నో కల్పించి భజింపనెంతు మిల నేదో బుద్ధిలోపంబుచే
ఈకాలుష్యము బాపి ప్రోవగదె తండ్రీ ! మమ్ము సర్వేశ్వరా !

ఐనం బోయిన దేమి ? మానసము దీక్షాబద్ధ సంకల్పమై
నీ నామంబు జపించుచున్ పరమ శాంతిం బొంది దీపించి పా
పానీకమ్ముల పారద్రోలు నెడ మాన్యంబే యగున్ ఎట్టి పే
రైనన్ నిశ్చలభక్తి కావలయు నీయందింక సర్వేశ్వరా !

ఆకారం బిదియంచు వేఱ్పఱుప సాధ్యం బౌనె సర్వంసహా
ప్రాకారంబె త్వదీయ కాంతిమయ రూపంబౌచు భాసిల్లి అ
స్తోక ప్రస్ఫుట జీవనోజ్జ్వల మహస్సుల్ నింపగా నీ కనే
కాకారంబుల లోకు లేలనో వృధా కల్పింత్రు సర్వేశ్వరా !

భువిపై నిన్ను ననేకరూపములలోఁ బూజింతు రార్యుల్, మహా
శివుఁడౌదీవు శివమ్ము నీహృదయ మా శ్రీ కాంతుఁ డాద్యుండు కే
శవుఁడున్ నీవె జనమ్ము లేమనుచు పూజల్ చేసినన్ ప్రేమరా
శివి చేకొందు వొకే విధమ్మునను సుశ్రీలిచ్చి సర్వేశ్వరా !

# కవితాతపస్సు

సవనాద్యుత్తమ సత్క్రియల్ సలుపు సంస్కారమ్ము లైశ్వర్య వై
భవముల్ లేవు, మనోజ్ఞ కావ్య రచానాభ్యాసమ్ము నాచేతనౌ
కవితారూపమునన్ భజింతును భవత్కారుణ్య భిక్షార్థినై
భవబంధమ్ముల చిక్కనీయకుము దేవా, నన్ను సర్వేశ్వరా!

నను లోరాచిన రాపిడై ఒక వినూత్నంబైన రీతిన్ చిరం
తన చేతోమథనమ్మునై చెలఁగి చిత్తానఁద సఁకల్ప సా
ధనలో నిన్నుఁ దలంచి వ్రాసినవి పద్యస్తోత్రముల్ వీని కీ
వనుకూలుండవ యేని సిద్ధి యగునయ్యా నాకు సర్వేశ్వరా!

హితవాక్యమ్ములో, ప్రార్థనాదికములో యే దేవతారాధనా
స్తుతిగీతమ్ములో, నీతిసూత్రములో, చేతోభావసంపత్తితో
శతకమ్ముల్ రచియించు టాంధ్రకవితాచార మ్మిదే నాఁటి దీ
కృతికిన్ చేతులు కల్పుచుంటి మది నిన్నే నిల్పి సర్వేశ్వరా!

భువియఁదుం గల సర్వవిద్యల కడున్ పూజ్యంబు ప్రాజ్యంబు నా
కవితానైపుణి నాకొసంగితివి నీ కారుణ్య మేపార, సం
స్తవముఁ జేసెద నీ మహత్త్వమును ప్రాణమ్ముండుదన్కన్ మనో
జవ సత్త్వఁబుల నిమ్ము నాదు కవితల్ సాగంగ సర్వేశ్వరా!

వ్రాయం గల్గెడి శక్తి యెన్నఁటికి లభ్యఁబై విరాజిల్లునో
నా యాంతర్యములోని పల్కెడి జగన్మాన్యంబులున్ మానవ
శ్రేయోదాయకమైన నీతిరచనల్ చేయన్వలెన్ కావ్య శో
భాయత్తమ్ములు శ్రేష్ఠముల్ మధురశబ్దశ్రీలు సర్వేశ్వరా!

# స్వర్గాదపిగరీయసీ

నానా పూర్వజనుః కృతమ్ము లవి పండన్ రాజి తాధ్యాత్మిక
స్థానం బైన పవిత్ర భారతభువిన్ జన్మంబు సిద్ధించె ఈ
పైనన్ చిత్తము నిన్ను లోనెఱిఁగి నీ భావంబునన్ నిల్వఁగా
జ్ఞానం బిచ్చిననాఁటి మాటగద భాగ్యం బింక సర్వేశ్వరా!

సుభగ శ్రీ మృదు వేదకాలపు టుషస్సుల్ పోల్చి భాస్వద్వచో
విభవోన్మీలిత కాంతులై యుపనిష ద్విజ్ఞాన సూర్యప్రభల్
నభముల్ నిండిన ఆర్యసంస్కృతి కళానందమ్ము లందమ్ములై
అభయ మ్మిచ్చెను మానవాభ్యుదయ భవ్యశ్రీకి సర్వేశ్వరా!

ఆవాల్మీకియు వ్యాసమౌనియును శబ్దాంభోనిధుల్ ద్రచ్చి భా
షావైదగ్ధ్యము చూఱలాడిన సుధాస్వారస్యముల్ దివ్యగా
థావాల్లభ్యము లే కథల్ చెలువు లొందన్ పల్కిరా కావ్య పు
ణ్యావిర్భావము లీ భువిన్ నిలుచు చంద్రార్కమ్ము సర్వేశ్వరా!

దైవాదేశము ధర్మపాలనము చేతఃప్రీతిఁ గొల్పన్ ప్రజా
సేవాజీవమె ఆశయమ్ముగ ధరాసీమన్ నృపశ్రేష్ఠులై
త్రోవల్ జూపి వెలింగినట్టి జనకాదుల్ నిల్చి రీ భారత
ద్యోవీధిన్ నిజకీర్తిమ ద్విమల కాంతుల్ పర్వ సర్వేశ్వరా!

నదులున్ వార్ధులు శైలశృంగము లరణ్యమ్ముల్ సమస్తమ్ము నా
యెదుటం గన్పడుచున్న ప్రత్యణువునం దేవో స్ఫురింపన్ మనో ఽ
భ్యుదయ శ్రీ రుచి రార్యధర్మ మధురమ్ముల్, భారత క్ష్మాతలం
బిది నాదేశ మటంచు గర్వపడుదున్ హృద్వీథి సర్వేశ్వరా!

తేజోహీనము పాపకర్దమ సముద్విగ్నమ్ము, దీనమ్ము నౌ
నాజీవమ్మున ఆత్మచింతన కళానందోల్లసద్భావ నీ
రేజమ్ముల్ మొలిపించు నీ భరతధాత్రీఖండ మీ దేశమం
దే జన్మింతు నికెన్ని జన్మముల కేనిన్ నేను సర్వేశ్వరా!

# నవీన విజ్ఞానము

విజ్ఞాన మ్మొక సాధనమ్ముగ మహావిద్వాంసుఁడైనట్లుగా
ప్రజ్ఞల్ చూపును మానవుండు. తన కీ ప్రావీణ్యసంధానమే
ధా జ్ఞాన మ్మొసఁగిచ్చె విశ్వము సమస్తంబున్ దివారాత్ర మే
యాజ్ఞాపాలితమై చరించునొ కనం డావంత సర్వేశ్వరా ?

అణువుం జీల్చి తదంతరస్థిత మనూహ్యంబైన శక్తిన్ వెలా
ర్చిన ధీసంపద గొన్న మాత్రమున గర్వీభూత చేతస్కుఁడై
మనుజుం డీ ప్రకృతిన్ జయించిన గతిం భావించు, నీ రీతి సృ
ష్టి నిగూఢార్థము లెన్నియెన్ని కలవో చింతింప, సర్వేశ్వరా !

బడులం దేగతి క్రొత్త పాఠములు నేర్పం జూతు రా భంగి క
న్పడుచుండున్ సరిక్రొత్త సంగతు లనంతంబైన బ్రహ్మాండ మం
దడుగడ్గున్ పరికించి చూచుకొలఁదిన్, ఆయా విశేషంబులన్
నుడువన్ నేరని వాఁడు నిన్నెఱుఁగు విజ్ఞుండౌనె ? సర్వేశ్వరా !

కనులం గన్పడు సౌరమండలము నక్షత్రాళియున్ నీమహా
ఘనతేజంబున నొక్కయంశమనగా కల్పాంతముల్ చెల్లినన్
మనుజుం డెట్టు లెఱుంగ నేర్చు నిక నీమాహాత్మ్యముల్, నీపయిన్
మనఃధ్యానమె కాదె నిన్దెలియు సన్మార్గమ్ము సర్వేశ్వరా !

తనవిజ్ఞానమె యూతగా గగనయాత్రల్ సేయుచున్ దూరద
ర్శన దూరశ్రవణాదులన్ నరుఁడు నిర్వర్తించుటల్ ధాత్రి నూ
తనముల్ కావివి భారతీయఋషు లాత్మజ్ఞానులై యోగశ
క్తిని సాధించిరి మున్నె పూర్ణమగురీతిన్ వీని సర్వేశ్వరా !

ఈ ప్రాపంచికశక్తి కొంతవఱకే యేగున్; అనంతప్రభా
దీప్రస్తుత్యము సత్యముం దెలియు సిద్ధింగాంచు సామర్థ్యమున్
ధీప్రాబల్యము నిచ్చు జ్ఞానగరిమోత్సేకంబు వేదాంతయో
గప్రావీణ్యమె కాని, అన్యమొకఁడున్ గాబోదు సర్వేశ్వరా!

వేదాంత మ్మనునన్ నవీనమగు నీ విజ్ఞాన మైనన్ సరే
సాధింపం దగు సృష్టిమూల మొకఁడే సద్వస్తు వాశక్తి సం
పాదింపంగల శేముషీగరిమ మాత్మజ్ఞానమే కాని యే
వాదంబుల్ కొఱగావు నిద్దెలియు నధ్వంబందు సర్వేశ్వరా!

ధర నీనాఁడొక నవ్యనాగరిక ముద్రాయత్తమై ధర్మపుం
దెరువుల్ లేని విలాసజీవితమునం దీ మానవశ్రేణికిన్
పరమున్ లే దిహముం గనంపడదు శశ్వాన్మానవాదర్శ సు
స్థిరమార్గమ్మును జూపి ప్రోవగదె పృథ్విన్మమ్ము సర్వేశ్వరా!

ధరణిన్ మానవజాతి కీ విడిన మేధాశక్తు లా మారణో
ద్ధుర చండ ప్రళ యాగ్నిగోళ గుళికా స్తోమంబు సృష్టింపగా
సరిపోయెన్, జను లే భయంకర మహాసంగ్రామ వహ్నిచ్ఛటా
సరణిన్ గ్రమ్మగి నశింతురో యిక భవిష్యత్తెట్లొ సర్వేశ్వరా!

ఈ విజ్ఞానము, ఈ నవోదయ కళా హేలా పరిష్కార మే
ధా వైశద్యము శాంతిసౌఖ్యముల సంధానించి పాలించు మేల్
త్రోవం జూపుము మాననాళి కిలయందున్ శాశ్వతానంద వీ
చీవిన్యాసము దేశదేశములలో చెల్వొందద సర్వేశ్వరా!-

# నిర్వేదము

మేమో మానవమాత్రజీవులము స్వామీ! అర్థలోభమ్ములన్
కామోద్రేకము లాఁగగా గలగు సంకల్పస్థిరత్వమ్ములన్
సామర్థ్యమ్ములు లేనివార మెటులీ సంసార తాపత్రయ
వ్యామోహమ్ము నశించి శాంతిరమ ప్రాప్తంబౌను సర్వేశ్వరా!

కోపోద్రేక విమోహ లోభమున పెక్కుల్ పాపముల్ జేసి త
త్పాపవ్రాతము బాపగా తుదకు నిన్ బ్రార్థింపగా నేల? ఆ
పాపంబుల్ చొఱలేని నిర్మల మనఃపావిత్ర్యమున్ పొంద నీ
ప్రాపున్ గోరుట మేలటంచు మది సంభావింతు సర్వేశ్వరా!

ఓహో ఈమదికెంత మత్సరము, కోపోద్రేక మింతెంత, గ
ర్వాహంకారము లెంత, సర్వమును తానై చేయుచున్నట్టు లీ
దేహమ్మున్ నడిపించు నింద్రియములన్ దీంద్రింపఁజేయున్, సుఖ
వ్యూహంబందునఁ ద్రోసి లోగొనును జీవున్‌బట్టి సర్వేశ్వరా!

భూమిన్ బెద్దయె మంచిగా కనులు కప్పున్; మోహవిభ్రాంత పీ
ఠా మాలిన్యము లేచి మానసము నాచ్ఛాదించి బాధించగా
సామాన్యుండను దారితెన్నులను పోల్చన్ లేని చీకట్లలో
నేమైపోదునొ తీయు మీ తెరలు స్వామీ! యింక సర్వేశ్వరా!

అవిరామంబుగ సాగు దుస్తర మవార్యంబైన ప్రస్థానమం
దివి నాకిప్పటి కెన్ని పుట్టువులు, నాకిం కెన్ని రానున్న వే
యవధిం జూడని దేహయాత్ర లివి నన్నాడించిపీడించు నా
హవమధ్యంబునఁ ద్రోసివైచినవి యత్యంతంబు సర్వేశ్వరా!

ఇది యర్హం బిదిగర్హణీయ మిదేదుష్కృత్యం బటం చన్నిటిన్
మదిలోఁ జూచియు చూడనట్లుగ నటింపంబోవు మాయావి నీ
చదువుల్ నేర్చిన పాపకర్మునికి పశ్చాత్తాపమే కల్గబో
వ, దికేమంచును నిన్నుఁజేరుటకునై వాంఛింతు సర్వేశ్వరా !

అనిశం బీబ్రతు కిట్లు కామవివశంబై లోభస దష్టమై
పునరుద్భూత పునఃప్రభూతము జనుర్మోహంబునం జిక్కిపో
వునో యేమో, యిక జ్ఞానదీపికల సొంపుల్ లేని చింతాతమ
స్వినియై జీవిత మెన్నిపుట్టువుల గాసింబొందు సర్వేశ్వరా !

తొలినాళ్ళన్ శ్రుతమైన మేల్చదువులందున్ చిత్తమొక్కింత నే
నిలపం జూతున యేని ఒక్క క్షణమేనిన్ నాది కానట్లుగా
తలఁపుల్ పెక్కువిధాల లోఁగొనుచు పంతాలాడి శాసించు నా
యలసత్వం బిది వేయియేనుఁగుబలె పెద్దైతోచు సర్వేశ్వరా !

ప్రాతిన్ నిత్య జపాది సువ్రత తపఃప్రారంభ దానక్రియా
జ్యోతిష్టోమము లాచరించుటలు లేదొక్కింతయున్, భక్తి రే
ఖాతాదాత్మ్యము కూడ కన్పడదు శంకాసంకులంబైన నా
చేతఁబాదు, నికెట్లు లీ బ్రతుకు వాసింగాంచు సర్వేశ్వరా !

పదిలమ్మై బహుజన్మ పుణ్యకలనా ప్రాదుర్భవ ద్యోగమై
కదలన్ నాయెద మొగ్గవిచ్చిన మనోజ్ఞ స్వాదు భావమ్మెదో,
ఇది యేనాటి మనోరథ మ్మిటుల స్వామీ ! నీకృపాలోకనా
భ్యుదయ శ్రీ రుచిరార్ద్రరేఖ కయి రాపుల్ వెట్టు సర్వేశ్వరా !

బ్రతుకుంబాటల జ్ఞానదీప్తులను తీర్పంజాలు నైపుణ్యముల్
వెతుకంజాలని చేతకానితనమై వేయేండ్ల కిట్లే ప్రభూ !
బ్రతుకెల్లం జనునో, మఱెన్నటికి నేన్ ప్రారబ్ధ సంవిత్కళా
ప్రతిభామార్గము దిద్దితీర్చికొని దీప్తంబౌనొ సర్వేశ్వరా !

ఈమాయావృత లోకసౌఖ్యముల యఁదే నమ్మకమ్ముంచి నే
నేమైపోతిని బ్రాహ్మ్యసంపదలు తండ్రీ నా కసాధ్యఁబులై
సామీప్యంబున కానరా విక జనుష్పారమ్య మేనాఁటికో
యామార్గఁబది గోచరించువఱ కిక్లేయుఁదు ; సర్వేశ్వరా !

నీ వెందుంటివి రూప మెట్టిదని ప్రశ్నింపంగ నాకేల? నీ
యావాస మ్మది ప్రాణికోట్ల హృదయం బందున్న దంచెన్నడో
నీవే పల్కితి వింక కోరెద మదిన్ నిన్గాంచు నాధ్యాత్మ బో
ధావిర్భావ నిధానమై వెలయు నంతర్దృష్టి సర్వేశ్వరా !

జ్ఞానాధ్వ మ్మిసుమంతకూడ తెలియాంగాలేని దీనస్థితిన్
నేనై చేసిన వెన్నియెన్ని కలవో నింద్యమ్ములంచున్ దలం
పీ నా గుండియపట్టి పోదు; నను సైరింపంగ సన్మార్గ ని
నిర్మగ్నుని చేయగాఁదగు సురక్షల్ నీవె సర్వేశ్వరా !

వివిధ ప్రస్ఫుట కాఁతిరూపములతో విశ్వమ్ము నఁదెల్లెడన్
సువిలాసమ్ముల వెల్గు నీపృథుమహస్సుల్ చూడగానీయకన్
నవయించున్ కనులుఁన్న గ్రుడ్డితన మజ్ఞానమ్ము, నాకెప్పుడీ
తెవులుంబాపెడి జ్ఞానదృష్టి నిడెదో దీవించి సర్వేశ్వరా !

ఈకన్పించెడి విశ్వమంతయును నీవే యన్నచో నేను నీ
యాకారంబున పోల్చలేని యణువై అల్లాడు చుంటిన్ ప్రభూ !
నీకాళ్ళంబడి వ్రేలనిమ్మటులనే నిత్యం బణుప్రాయమై
నాకఁజాలును నీపదాంబుజరజస్థానమ్ము సర్వేశ్వరా !

ఆసల్ పెంచుకొఁంది జీవితము సౌఖ్యం బింతయున్ లేక ఆ
యాసంబై చను నిట్టియాసలకు లేదంతంబు, విశ్వ బున
దీ సంసారము లోభదుష్టమయి యిట్లే సాగుచున్నప్పు డే
దో సంతృప్తి నొసంగి ప్రోవవలె మమ్మోదేవ సర్వేశ్వరా !

మతియం దెంతటి యాదరమ్మొసఁగి సమ్మాన్యత్వ మేపారినన్
సుతులుం దండ్రియు బంధుగుల్ సతియు నాసోదర్యులున్ స్నేహితుల్
హితముం గూర్తురు వారివారి కగునట్లే కాని నీవైనచో
సతిపుత్రాదులు సర్వమై మనుతు వ్రశాంతమ్ము సర్వేశ్వరా!

నేనెవ్వండను నీస్వరూపమును వర్ణింపంగ నీ రూపరే
ఖానూనోజ్జ్వల సాధుతేజ మది యూహాతీతమై వెల్గగా
ఈ నా మానస మెన్ని జన్మముల గానీ పోల్చుకోనౌనె, ఏ
దైనన్ వేఱొక అడ్డదారి యిక లేదా నాకు సర్వేశ్వరా!

కన్నుల్ గానని కామలోభమయ సంకల్ప ప్రభావంబు లె
న్నెన్నో స్రోవలుగాసి జీవనము గారించున్, భవన్మాయ కా
కున్నన్ తేనెలుపూయు నీ విషము లేలో మాకు సంప్రాప్తమౌ ?
నన్నీ మోహమునందు ద్రోయకుమె దీనాత్ముండ సర్వేశ్వరా!

ధ్యానాభ్యాస తపఃక్రియా కలిత మాధ్యాత్మైక చింతాద్రుతిని
నేనై చేసిన సాధనాలవము లేనేలేదు, నిన్నూరకే
వేనోళ్ళన్ వినుతింప నేమిఫలమౌ విశ్వేశ! ధర్మోదయ
శ్రీ నిష్ఠా నియతమ్ము చేయగదవే చిత్తమ్ము సర్వేశ్వరా!

ఆయుర్వాయువు లాగిపోయిన క్షణమ్ముందున్ శరీరమ్ము నీ
మాయాలోకమునందె డించి కనుపింపన్‌రాని రూపంబుతో
నే యధ్వంబుల బట్టి జీవుఁడిక తా నెం దేగునో, నీ పద
ధ్యేయోపాంతము నందు నిల్చు నిముసంబే చాలు సర్వేశ్వరా!

అసువుల్ దేహమునందు నిల్చువఱకే ఆప్యాయతల్ చెల్లు నీ
ముసుగుం ద్రోచి తొలంగి జీవుఁడెటకో పోవంగ ఈభూమిపై
మసలన్ యెవ్వరి కెవ్వరౌదురు ప్రభూ! మాకున్ శరణ్యంబు ని
త్య సముల్లాసపదంబు నీచరణసంస్థానమ్మె సర్వేశ్వరా!

లోలత్వంబున ప్రేమబంధములు మాలో మాకు కల్పించి యి
ట్లేలా జీవినిబట్టి యాపుటలు నీలీలావినోదార్థముల్
చాలున్, తావక రూపవిభ్రమ దిదృక్షా సాధనోపాయమౌ
ఆలంబ మ్మొక డున్నచో తెలుపు మయ్యా యింక సర్వేశ్వరా!

లోకం బెల్ల సృజించి పెంచి తుదకున్ లోలీన మొందించు లీ
లా కళ్యాణమహస్సు నొక్కపరి కళ్ళన్ జూతునా యన్నటుల్
ప్రాకామ్యమ్మయి నిత్యమానసతపఃపారమ్యమై తోచుచున్
నాకేదో తుదిపట్ట దీ తలఁపికెన్నాళ్ళైన సర్వేశ్వరా:

వేదాంతార్థ మెఱుంగ, శాస్త్రపఠనా విద్వాంసుడన్ గాను, ఏ
వేదమ్మున్ చదువంగలే దుపనిషద్విజ్ఞానమున్ లే దికే
వైదుష్యమ్మను లేదు, నెమ్మదిని దివ్యజ్ఞాన మబ్బంగ నా
కేదీ దారి యటంచు కల్గు నొక నైస్పృహ్యంబు సర్వేశ్వరా!

ఆకారం బొకఁడేని లేకయును సర్వాంతర్బహిర్వ్యాప్తమౌ
సాకారుండవు నీవు సర్వజగతీ సమ్రాట్టువున్ నీవె, నీ
సాకల్య స్థిరశక్తి లేశమయినన్ స్వాంతంబునం గాంచగా
ఏ కన్విప్పు నొసంగి ప్రోచెదవొ తండ్రీ! నన్ను సర్వేశ్వరా!

నీ తేజోంశ మొకండె విశ్వతలముం దీపింపగాజేయు శ్రీ
చైతన్యం బని తెల్పు వాక్యములలో సత్యమ్ము లేశమ్మునున్
చేతంబందు గ్రహింపలేని జడుడన్, నిన్నెట్టి రీతిన్ పరం
జ్యోతీరూపముగా గ్రహింపగల దీయుల్లమ్ము సర్వేశ్వరా!

నను నెట్లీడ్చిన ఈడ్వనిమ్మటులనే నాపూర్వకర్మంబు, ప్రా
గ్జని సంస్కారము తప్పుకోనగునె పీసంబైన, యెట్లెట్టులో
నిను నాత్మన్ గురుతించుచున్ బ్రతుకుచుంటిన్ నేడు రాబోవు నా
జని యైనన్ చరితార్థమౌ ననెడి యాసన్నిల్పి సర్వేశ్వరా!

# సాధన

ప్రకటామోదకరమ్ములై మిగుల స్వారస్యమ్ములై యొప్పియున్
సుకవిత్వమ్ములు గానసంపదలు సఁస్తుత్యమ్ములౌ నృత్య చి
త్రకళావిద్య లవెల్ల సార్థకములై రాణించు, నీ చిత్తశాం
తికి తావై విలసిల్లి నప్పుడె కదా నిత్యమ్ము సర్వేశ్వరా !

ధరనెవ్వానికిఁ గూడ సౌఖ్యములు నిత్యశ్రేయముల్ కావు, దు
ర్భరకష్టంబులు గూడ దుస్తరములై బాధింప వీ పృథ్విపై
స్థిరచిత్తంబున వీనిరెంటి నొకరీతిం జూచి జీవించుటే
తెరు వీ లోకమునందు శాంతిసుఖతృప్తిన్ బొంద సర్వేశ్వరా !

మనుజుం డెప్పుడు దేహపోషణకె సన్మార్గైక సఁచారియై
తనకుంజాలిన భాగ్యమబ్బునెడ స్వాంతంబందు సంతృప్తితో
మనుటే మేలగు, మేరమీఱిన ధనం బత్యంత మీదేహమున్
మనమున్ స్తబ్ధముజేసి బుద్ధిని నశింపంజేయు సర్వేశ్వరా !

చదువుల్నేర్చిన దానికిన్ ఫలము సంస్కారమ్ము చేకూరి సౌ
హృదసంపత్తియు, సర్వభూతకరుణార్ద్రీభూత సద్భావమున్
మదిలో జ్ఞానవికాసమున్ కలుగుచో మాన్యుండగున్ కానిచో
చదువుల్ సర్వము వ్యర్థమై చనిన కష్టం బౌను సర్వేశ్వరా ?

నే నంచున్ మఱి నాది యంచు మది నెంతే రక్తి గర్వించుచున్
ఈ నేనన్న పదార్థ మిట్టిదని వర్ణింపన్ అశక్తుండనై
నానారీతులు గాగ బీతువడుచున్నానయ్య, యోచింపగా
ఈ నేనన్నది లేదు సర్వమును నీవేకాని సర్వేశ్వరా !

ఎన్నండో వినియున్న భావములనే ఈనాడు సైతమ్మిటన్
నిన్నున్ గూరిచి వ్రాయుచుంటిని ననున్ నిందింపగాబోకు మా
పన్నుం డిట్టులె వేడు స్వామిదయ సంప్రాప్తించు దన్కన్; భవత్
సాన్నిధ్యంబును గోరి వ్రాత లిటులే సాగింతు సర్వేశ్వరా !

నీ నామ స్మరణోత్తమవ్రతములన్ నిత్య మ్మనుష్ఠించినన్
కానీ అక్కఱలేదు పెట్టుబడి, ఏకష్టంపు కార్యంబులన్
పూనంగా పనిలేదు, మానసము సమ్మోదంబుతో ఊరకే
నీ నామంబు జపించుచో విమల శాంతిం బొల్చు సర్వేశ్వరా !

నీ నామస్మరణన్ జయప్రదముగా నెగ్గున్ దినం బంతయున్,
నీ నామంబు జపింప రాత్రు లరుగున్ నిద్రన్ ప్రశాంతమ్ముగా,
నీ నామస్మరణప్రభావమున మేనిం జేర వేరోగముల్,
నీనామంబె లభింపజేయు శుభముల్ నిత్యంబు సర్వేశ్వరా !

ధనధాన్యంబులు భోగభాగ్యము లనంతంబైన సంపత్తులున్
ఘనకీర్తుల్ గృహవాహనాది సుఖముల్ కల్గింపగాఁ జాలునే
క్షణమైనన్ మది శాంతి? దీని నిలపై సాధింపగా నీపయిన్
మనన ధ్యానవిశేష భక్తి యొకటే మార్గంబు సర్వేశ్వరా !

పలుశాస్త్రంబులు వేవిధమ్ములుగ నిన్ వర్ణించు రూపమ్ముకై
కలలం గాంచుచు క్రిందుమీదయిన దీక్షల్సాగి నానాటికీ
తలపండించిన సాధనానియమ యత్నంబింక సంపూర్ణమై
నిలువంగల్గునె యీతపస్సును విలన్ నీనీడ సర్వేశ్వరా !

ఆరాధించితి సర్వదైవముల నా యా క్షేత్రముల్ చూచి, కా
శీ రామేశ్వర పుణ్యతీర్థముల సంసేవించితిన్, పుణ్యభా
గీరధ్యాపగ యందు గ్రుంకులిడితిన్, కీలించితిన్ శీర్షమం
దారూఢిన్ భవదంఘ్రియుగ్మమె శరణ్యమ్మంచు సర్వేశ్వరా

అఱవై దాటిన దాయు వీ పయిని సన్న్యాసమ్ములో జీవిత
స్ఫురణన్ దేల్చుచు ప్రొద్దుబుచ్చెడి దినమ్ముల్ వచ్చె చిత్తమ్ము సు
స్థిరమై సాధనలందు నిల్వ దొకకించిత్తైన, వైరాగ్యపుం
దెరువుల్ కానగలేని జన్మమెటు సిద్ధింగాంచు సర్వేశ్వరా!

నరజన్మంబున సాగ దిప్పటికి నిన్ ధ్యానించు సన్మార్గ మా
మఱుజన్మంబున నీగృహోపవనసీమన్ పుట్టగానిమ్ము న
న్నిరవొందన్ చిరుపూవుగా నయిన, యే యేకాంతమందో భవ
చ్చరణారాధన చేసికొందు నిక శశ్వద్భక్తి సర్వేశ్వరా!

అక్షీణాదృతి నాకు నింతవఱ కీ యన్వేషణే కాని నీ
దాక్షిణ్యమ్మను లేదు లేదు ఫలితార్థమ్మింత, యిట్లే మనో
దీక్షన్ వేయిసమల్ తపించెదను హృద్దేశంబు సర్వమ్మునున్
ప్రక్షాళించెడు దాక నీదు కరుణావర్షంబు సర్వేశ్వరా!

నా పాపంబుల బాపి కావుమని నిన్ ప్రార్థింపగానేల ఈ
నా పాపంబులు గాని మంచిపనులైనన్ నావియై మత్తపః
శ్రీపుణ్యోదయ సత్క్రియాచరణమే శ్రేయమ్ములన్ గూర్చి నన్
గాపాడన్వలె నంచు సంతతము నే కాంక్షింతు సర్వేశ్వరా!

అద్వైతస్థితి, ద్వైతభావము, విశిష్టాద్వైతతత్త్వమ్ము, ద్వై
తాద్వైతమ్మును, సర్వదర్శన మహత్త్వం బే పథంబైన స
పద్వైరాగ్య పవిత్ర సాధనమె యై మాకొక్క ఆధ్యాత్మికో
ద్యద్వైశద్యము చూపి మోక్షగతి సంధానించు సర్వేశ్వరా

# ఏమందువు

అణువందున్ పరమాణు సూక్ష్మము నదృశ్యంబైన కానిమ్ము, నీ
ఘనరూపమ్ము సమస్తమై వెలుగుచున్ కాన్పింప వేమయ్య యెం
తని యన్వేషణ చేయజాలుదు నిలన్ నాకింక లేదందువా
నినుఁ గన్గోగల శక్తి లేశమును తండ్రీ! దేవ! సర్వేశ్వరా!

ఒక దేహమ్మిడి కోరికల్ మనిచి యేవో కొన్ని భాగ్యమ్ము లై
హిక సౌఖ్యమ్ముల గల్గఁజేసితివి, ఇంకేవేవో లేవంచు నెం
తకు సంతృప్తిని పొందలేని జడుఁడన్ నాకింక పోదందువా
ప్రకట ప్రాకృత లోభమోహగత భావమ్మిద్ది సర్వేశ్వరా!

అనిశం బీ యిహలోక జీవనగత వ్యాపార దుర్వార ఘ
ర్షణలన్ మున్గుచుఁ దేలుచుంటి నిదె స్వర్గంబంచు, సంసార బం
ధనముల్ త్రోయగలేని మూఢజనుఁడన్ నాకింక రాదందువా
మనమున్ లగ్నమొనర్చి నిన్ను భజియింపన్ శక్తి సర్వేశ్వరా!

ప్రథితామ్నాయ నిబద్ధసూత్రగత కర్మాభ్యాస విజ్ఞాన సం
పద నూహింపగ లేని చంచల సుఖభ్రాంతి ప్రమత్తుండ, నా
మదిలో తీరిక గల్గినప్డె నిను సంభావింతు, కాదందువా
ముదమారన్ దయసేయు మయ్య భవనిర్మోహంబు సర్వేశ్వరా!

పటుదుర్వారము లీ ప్రపంచవిషయ వ్యాసంగ తాపత్రయో
త్కటపాశంబులు వీనిఁ ద్రెంచుట యసాధ్యం బీ జనుర్దుఃఖముల్
మటుమాయం బొనరింప మౌనివనసీమల్ బట్టి పొమ్మందువా
అటులైనం దయసేయుమయ్య తగు ధైర్యస్ఫూర్తి సర్వేశ్వరా!

ఈ నా చిత్త మిదెన్నిపుట్టువుల కిట్లే నిన్ను వెంటాడినన్
కానన్ రావు సరే, భవన్మృదు కటాక్షస్నిగ్ధ రేఖామృతం
బైనన్ బిందువు రాల్తు వంచు సతత మ్మాసింతు నేమందు వ
య్యా నీ నా నడుమన్ అగడ్త లివి యేలా త్రవ్వ సర్వేశ్వరా.

# శ్రుతి సూక్తులు

సర్వం బక్షిశిరోముఖంబులును హ స్తశ్రోత్రపాదంబులై,
సర్వవ్యాపివి సర్వసాక్షివియు విశ్వంబెల్ల నీవై మహా
ఖర్వ శ్రీ పరమాత్మవై వెలుగ సత్కర్మానుసారమ్ముగా
నుర్వీవాసులు సంచరించుట గదా యుక్తంబు సర్వేశ్వరా!

అరదం బీ తను వింద్రియ ప్రతతియున్ అశ్వంబు లీ మానస
ఖరయన్ పగ్గము బుద్ధిసారథి, ప్రపంచార్థమ్ము లధ్వమ్ములై
జరుగున్ జీవనయాత్ర ఆత్మరథి కీ సన్నాహముల్ నీకృపా
పరతన్ బొందునుగాక మోక్షపదసౌభాగ్యంబు సర్వేశ్వరా!

శ్రవణాలోకన వాఙ్మనోగతులు భాస్వద్రీతి తత్తద్గుణా
ర్జవశక్తిన్ చరియించు హేతువగు తేజమ్మీవెయై యుండి, ఆ
శ్రవణాదుల్ కనలేని నిష్కలపరబ్రహ్మంబువై పొల్తు వీ
వవికల్పస్థితి; నిన్నెఱింగెడి యుపాయంబేది సర్వేశ్వరా!

ఆశ్చర్యంబుగ జూచుచుండు నొకడీ యాత్మన్, మఱొక్కండు తా
నాశ్చర్యంబుగ మాటలాడు, వినునిట్లన్యుండు, వీరెవ్వరున్
ఆశ్చర్యంబిది సత్యముం దెలియలే రాధ్యాత్మికాభ్యాస ధీ
నైశ్చల్యస్థితి లేక ఆత్మ నెఱుగన్ శక్యంబె సర్వేశ్వరా!

పరమం బక్షర మంచు దేనిని కడున్ వర్ణింత్రు వేదజ్ఞు, లే
స్థిరవాసంబును వీతరాగులగుచున్ జేరంగ యత్నింతు, రే
వరలబ్ధిం గొన బ్రహ్మచర్యవిధులం బాటింతు రా మోక్షభా
గ్య రమావాసము నీవకావె పరమాత్మా! దేవ! సర్వేశ్వరా!

వెలుగున్ వెల్లువ లగ్నిసూర్యవిధు లావిద్యుత్తులున్ తారకల్
వెలుగన్ నేరని స్థాన, మే వెలుగుచో విశ్వంబదెల్లన్ కళా
నిలయంబై తులకించు నా వెలుగు తండ్రీ నీవె నాజన్మమున్
వెలిగింపన్వలె నీకృపామృత కళావిస్ఫూర్తి సర్వేశ్వరా!

## సంభవామి యుగే యుగే

భూమిన్ వేదవిధాన ధర్మ మఖిలంబున్ నాశ మొందింపగా
సామర్థ్యంబును జూపి వేదములతో సంద్రంబునన్ డాగె దు
ర్ధీమంతుం డగు సోమకుం, డతని శక్తిన్ దున్మిమాటాడ నీ
వే మత్స్యంబయి వత్తువో యను తలంపే లేక సర్వేశ్వరా!

అమృతాపేక్షను దేవదానవులు దుగ్ధాంభోనిధిన్ ద్రచ్చగా
కమఠంబై పెనుగొండ కవ్వముగ వీకం దాల్చి, కాంతాకృతిన్
అమృతం బెల్ల సురాళి కిచ్చితివి దైత్యానీకముల్ డీల్వడన్;
విమలోదారము లీ కథల్ నిరత ముర్విన్ నిల్చు సర్వేశ్వరా!

వారిన్ మున్గిన భూమి నెత్తుటకు పోవన్ నిన్ను వారించుచున్
వైరంబూని అకారణంబుగను నీపై దూకు హేమాక్షు దు
ష్ప్రారంభంబుల పోత్రిమాత్రమయి రాపాడించి మాకోసమై
శ్రీరమ్యస్థలి జేసి నిల్పితివి ధాత్రిన్ నీవు సర్వేశ్వరా!

హరిభక్తుండును బాలుడైన సుతు బ్రహ్లాదాఖ్యు హింసింపగా
హరిలేడున్ గిరిలే డటంచు పటుగర్వాహంకృతిన్ వచ్చు ము
ష్కరదైత్యప్రభు వా హిరణ్యకశిపున్ గారింప స్తంభంబునన్
నరసింహాకృతి నిల్చినావు జగమానందింప సర్వేశ్వరా!

కలితోద్య ద్బహుదానశీలి ననుచున్ గర్వించి దైత్యుండు నీ
బలమూహింపక వామనుం డనుచు నిన్ భావించెనే కాని ఆ
బలి మూడడ్గుల నేల యీగలడె సర్వవ్యాపివౌనీకు, ఏ
తలయో దానమొసంగి కావలయు నీదాసుండు సర్వేశ్వరా!

హలముం దాలిచి నిల్వ క్షాత్రవజగం బల్లాడె నీధాటి కా
హలమే నేడు వరప్రసాదముగ సస్యాధారమై నిల్చి మ
మ్మలరం జేయును, నీమనోనిలయ తాత్పర్యార్థ సద్భావనా
బలమేదో బలరామమై యిడు జగద్భాగ్యంబు సర్వేశ్వరా!

వనసంచారము వేణునిస్వనము శశ్వద్గోపికారాపమో
రణపాండిత్యము రాజనీతియు పవిత్రస్వాదు గీతార్థమో
జనహృత్సీమల దోచికొన్నవి విరాజత్కృష్ణతత్వమ్ము లీ
ఘనతేజమ్ముల నూహసేయుటకు శక్యంబౌనె సర్వేశ్వరా!

ఆ యైక్ష్వాకుల వంశమం దుదయమై ఆరణ్యముల్ బట్టి దై
తేయధ్వంస మొనర్చి మానవప్రవృత్తిన్ శాశ్వతమ్మౌ ప్రజా
శ్రేయోదాయక రామరాజ్యముల కూర్చెన్ దివ్యసంవిత్కళా
ధ్యేయం బయ్యది రామతై జన మహాధీశక్తి సర్వేశ్వరా!

నిత్యక్లేశ నిబద్ధ జీవతతికిన్ నిర్వాణ సంప్రాప్తికై
సత్యాన్వేషణ సాగిసాగి భువికిన్ శాక్యర్షి సంప్రోక్తముల్
సత్యాహింసలు శాంతిధర్మపథలక్ష్య ప్రేమసూత్రమ్ములై
అత్యంత మ్మిహలోక సంతరణ రథ్యల్ వెల్గు సర్వేశ్వరా!

కలికాల మ్మిది భోగదాస్యపరమై కాలుష్యమై పాపసం
కలనన్ ధర్మవిలుప్తమై చెడిన లోకమ్మిద్ధి ధర్మస్థితుల్
నెలకొల్పన్ తురగమ్ము నెక్కి అసి పాణింబూని రానున్న నీ
విలసత్ కల్కి మహావతారము నికన్ వీక్షింతు సర్వేశ్వరా!

# గీతాదేశము

ఆ నాఁ డర్జును (డే మనోవ్యథకు లోనై ధర్మసమ్మూఢతా
ధీనుండై సమరావనిన్ శరణు పొందెన్ నిన్ను, నేనట్టులే
దీనత్వంబున నుంటి గమ్యపథవృత్తిన్ పోల్చుకోలేక నీ
పైననన్ దేల్తువటే ప్రబోధమధు సమ్యగ్వృష్టి సర్వేశ్వరా!

దేహార్థ మ్మిటులేల సంతతము భ్రాంతిన్ ముగ్గి వర్తించుటల్,
దేహమ్మస్థిర మాత్మ నిత్యమని నిర్దేశింతు వేనెట్లు ని
ర్వాహింపంగల నాత్మయోగము స్థితప్రజ్ఞాఢ్యుగా నాదు గ
ర్వాహంకారము దూల్చి మేలుకొలుపన్ రాకున్న సర్వేశ్వరా!

మానన్ రాదు స్వధర్మకర్మ మను నీమాటల్ శ్రవఃపేయమౌ
కానీ కామము నన్నుబట్టి దిగలాగం జూచుచుండెన్ ప్రభూ!
ఈ నా కర్మఫలంబులన్ మఱచి, నేనేరీతి నిస్సంగినై
పూనం జాలుదు కర్మయోగ మది యుద్బోధింపు సర్వేశ్వరా!

పుడమిన్ ధర్మము నిల్పి దుష్టులను నిర్మూలించుచున్ సాధులం
గడకన్ బ్రోచెద నన్న నీదగు ప్రతిజ్ఞన్ లోకముప్పొంగె, ఎ
య్యెడలం దప్పవ యేని జన్మములు నీవీలోకమందింక నా
కిడుమా సాత్త్వికసాధుజన్మమది యింతే చాలు సర్వేశ్వరా!

కర్మంబందు నకర్మముంగనుచు దుష్కర్మమ్ములన్ మాని స
త్కర్మమ్మున్ బొనరింపు మీ విధియు ఆత్మజ్ఞాన సంసిద్ధికా
మర్మంబంచు వచించినాడ విక సామాన్యుండ నిష్కామమౌ
కర్మాభ్యాసమెటుల్ లభించు నని యాక్రందింతు సర్వేశ్వరా!

జ్ఞానాధ్వమ్మును జూపి మోక్ష మిడగా సన్న్యాసమున్ కర్మయో
గానుష్ఠానము రెండునున్ సమము లజ్ఞానాత్ములై యెంతు రి
వ్వానిన్ వేఱుగ సర్వభూతసమతన్ బాటించి నిర్ద్వందు డౌ
వానిన్ జ్ఞానియటంద్రు వీనినెటు సంపాదింతు సర్వేశ్వరా !

మనసున్ కట్టడిబెట్టి ఇంద్రియములం బంధించి స్థైర్యమ్మునన్
మనన ధ్యాన తపః ప్రభావ నిరతిం బాటించి యేకాగ్రమౌ
తనయాత్మన్ పరమాత్మఁ గన్గొని సమస్త ప్రాణిజాలంబులో
నినుఁ జూడంగల యోగి నిష్కలుషుడై నిన్బొందు సర్వేశ్వరా !

హారమ్మందున దారముంబలెనె మాయాచ్ఛన్న విశ్వంబునం
దారూఢస్థితి నున్న నిన్నెఱుఁగ లే కజ్ఞానినై స్రుక్కు చే
దారిం గానని నాకు శ్రద్ధనిడి ఆత్మజ్ఞాన మిమ్మంచు ని
న్నారాధించుచు నుంటి ప్రోవుము శరణ్యా దేవ సర్వేశ్వరా !

మరణం బెప్పుడు వచ్చి గొంతు బిగియింపం జూచునో భక్తి వి
స్ఫురణన్ నాఁడు స్మరింపఁగల్గుదునె, చిత్ జ్యోతిర్మయాకార మ
క్షర బ్రహ్మంబవు నిన్ను సంతతము నాస్వాంతంబునన్ నిల్పుకో
తెరువున్నన్ కరుణించి తెల్పుమది ప్రీతిన్ నాకు సర్వేశ్వరా !

నీయందుం గల వన్నిభూతము లికన్ నీవందు లేవంచు రీ
మాయన్ నేర్వను, నిన్ను నేమఱక ఆత్మన్ నిల్పగా సాధనో
పాయం బుండిన తద్రహస్యమును తెల్పన్ రాదె ఆరాజ వి
ద్యాయోగమ్ము పవిత్రధర్మముగ నభ్యాసింతు సర్వేశ్వరా !

శ్రీమన్మోహన మీ జగద్వితతి నీసృష్టిస్థితిన్ వెల్గుచో
నీమాహాత్మ్య విభూతులన్ నుడువగా నీవే సమర్థుండ వీ
సోమాదిత్యులు రుద్రుడాది పృథుతేజోమూర్తు లీ నా మన
స్సీమన్ నిల్తురు నీదు కాంతికళలై చెల్వారి సర్వేశ్వరా !

అక్షీణోజ్జ్వల కోటిసూర్య కిరణోద్య త్తేజ మత్యద్భుతం
బక్షయ్యమ్మగు తావకీన ఘన దివ్యద్విశ్వరూప మ్మెదో
సాక్షాత్కారము సేయు యొక్క క్షణమే చాలున్ ప్రభూః నీకృపా
భిక్షాభ్యర్థిని వేచియుంటి నిట నిన్వీక్షింప సర్వేశ్వరా ః

తను సౌఖ్యం బిది పోవ దింద్రియనిరోధ మ్మింతయున్‌లేదు నా
మనమున్ చంచలమై చరించు నిక కర్మత్యాగశీలమ్ము నా
కనువై తోచదు భక్తియోగ మెటు లభ్యస్తమ్ము కావింతు నో
యని యల్లాడుచు నుంటి తెల్పుమిక గమ్యమ్మెదొ సర్వేశ్వరా ః

తనువే క్షేత్రము దీనియందుగల ఆత్మాఖ్యుండు క్షేత్రజ్ఞుడం
చును వాకొందురు, వీనినిం దెలియు సత్సూత్రంబె జ్ఞాన మ్మనం
దనరున్, జ్ఞేయము మోక్షసద్మ మగు నాత్మజ్ఞాన బ్రహ్మమ్ము నా
మన మీ జ్ఞానపథాన బోవునటులన్ మళ్ళింపు సర్వేశ్వరా ః

గుణముల్ తామసరాజసమ్ము లివి నాకున్ శత్రులై దేహ బ
ద్ధునిగాఁ జేసి భ్రమప్రమాదముల యందుం ద్రోయుచుండెన్ ప్రభూ ః
అనిశం బీ భయ మెట్టు లోర్వగల నయ్యా సాత్త్వికోదాత్త వ
ర్తనలం ద్రిప్పుము చాలు నాకు పరమార్థంబిద్ది సర్వేశ్వరా ః

పైకిన్ వేళ్ళను శాఖలం దిగువకున్ ప్రాకించు నశ్వత్థమై
నాకుం గల్గగ కర్మబంధన మనంతంబైన సంసార మ
ఙ్ఞాకల్ బెట్టుచునుండె, దీనినిక వైరాగ్యాసి ధారాహతిన్
నీకన్ ద్రుంచు బలమ్ము నా కొసఁగవే వేగమ్మె సర్వేశ్వరా ః

వ్యసనాసక్తులు నాస్తికాత్ము లసురుల్ పాపక్రియాలోచనా
ప్రసరోద్వృత్తులు లోకకంటకులు నిన్ ప్రార్థింతు నోదేవ! న
న్నసురుం జేయకు, శాస్త్ర విహిత జ్ఞానార్జనోపాయ ము
ఖ్యసనంబుం బొనరింతు దైవగుణముల్ ప్రాపింప సర్వేశ్వరా!

ధ్యానాభ్యాస జపాది యజ్ఞకృతులం దాహారకార్యంబులన్
దానమ్మందును సాత్త్వికమ్మగు నన శ్రద్ధాసక్తి నిమ్మిపయిన్
నా నిత్యార్చనలో నియం దలతు ఓంతత్ సత్ పదాంకస్థితున్
ఈ నా జన్మమునందు లేదు గతి నీవేతక్క సర్వేశ్వరా!

అనువై సాత్త్వికభావ సమ్మతములౌ త్యాగమ్ము జ్ఞానమ్ము బు
ద్ధినిరూఢిన్ సుఖమున్ ధృతిప్రతిభయున్ దీపింపగాఁ జేయు మీ
మనమం దోప్రభు! మత్స్వభావ నియతంబైనట్టి సత్కర్మమం
దనుసంధింతు ఫలమ్ము గోరకయె ఆవంతైన సర్వేశ్వరా!

ఆ నా ప్రాక్తన కర్మదోషములు వెంటాడఁగ అజ్ఞాన పా
శానీకంబున జిక్కి డీలువడి ఆధ్యాత్మిక చింతా దరి
ద్రాణంబైన యెడందలో వెలిగె జ్యోత్స్నల్ నీప్రబోధామృతో
ద్గ్రాణప్రోజ్జ్వల చంద్రబింబ మృదురాకాశ్రీలు సర్వేశ్వరా!

నీయాధ్యాత్మిక బోధనోదయ రుచిస్నిగ్ధారుణశ్రీలలో
మాయామోహము దీర్గి మేల్కనిన యాత్మన్ భక్తి చూడాడుచున్
నీయాజ్ఞంబడి సర్వధర్మవిధులన్ నీకే సమర్పించి, ని
న్నేయర్చింతును నాశరణ్య మిక నీవేయంచు సర్వేశ్వరా!

# తత్త్వమసి

మురువుల్ మోసులు వారు పాప పసిమోముఁదమ్మి వెల్గొందు సుం
దర హాసాఁకుర కుంకుమార్ద్ర సుషమాతారళ్యముల్ సద్రుచి
స్ఫురణీయంబులు ముగ్ధమోహనములై సొంపుల్ దువాళింపులై
పరమార్థమ్ములు గ్రుమ్మరించు, నది నీవా దేవ! సర్వేశ్వరా!

తరుణం బెఁచి నవోదయోజ్జ్వల వసంతశ్రీలతో నెవ్వఁడీ
చిరుపూజొంపములందు తేనియలువోసెన్, రఁగులన్‌పూసె, న
త్తరుగందమ్ముల రాసులం గురిసె, సౌందర్యప్రభా వీధిగా
నరుదారన్ గయిసేసె పృథ్వి నది నీవా దేవ! సర్వేశ్వరా!

ఒకచోతేజము, శ్రీవిలాసమొకచో, సత్ఫుల్లసౌందర్య రే
ఖిక వేఱొక్కట, శక్తియుక్తు లొకచక్కిన్, శీల మిఁకొక్కెడన్
ప్రకటంబై భువినెల్ల భాసురకళా రమ్యంబుగా జేయు నీ
యకలం కోజ్జ్వల సద్విభూతి యది నీవా దేవ! సర్వేశ్వరా!

నీ వెందుంటివొ యంచు నెల్లెడల నన్వేషింపగాబోవు నా
భావంబున్ నిలద్రొక్కి యొక్క అనుకంపాస్ఫూర్తి పుట్టించు నీ
త్రోవంబోయెడి దీనభిక్షుకుని గొంతున్ విన్నయప్డెల్ల, నా
యావేశంబును గల్గజేయునది నీవా దేవ! సర్వేశ్వరా!

పనియేదైనను చేయ నెంచు నెడ తత్ప్రారంభకాలమ్మునన్
స్వన మొక్కండది తీవ్రవేగ హృదయస్పందమ్ము గావించుచున్
అనయంబున్ ఇదియోగ్య మియ్యది యయోగ్యంబంచు విన్పించు న
ట్లనుభూతంబగు హృన్నినాద మది నీవా దేవ! సర్వేశ్వశరా

అలఘుప్రాభవమై అతీంద్రియకనద్వ్యాపారమై నెమ్మదుల్
తెలియన్‌రాని గభీరతేజమొక జ్యోతీరూపమై ప్రాణికో
టులనెల్లన్ నడిపించురీతి కనుపట్టున్ దేహమందుండి, ఇ
ట్లలరింపంగల జీవకాంతి యది నీవాదేవ! సర్వేశ్వరా!

# శుభమస్తు

చిరుతన్ ప్రీతినొసంగి, నిశ్చల తపస్సిద్ధుల్ ప్రసాదించి. దు
ర్భరకష్టమ్ముల బాపి, మోక్షపదవీభాగ్యంబు కల్పించి యెం
దఱినో భక్తుల బ్రోచితా వమిత వాత్సల్యంబుతో, నిల్పు మా
పరమోదార దయావిలోకనము మాపై కొంత సర్వేశ్వరా!

వ్రాయంగావలె సత్కవిత్వములు, కావ్యానంద రాజత్కళా
ప్రాయంబై మనగావలెన్ పుడమి నీ వ్రాతల్ చిరస్థాయిగా;
నీయాజ్ఞంబడి సాహితీకృతు లిటుల్ నిర్మించునందాక నా
కాయు స్స్వాస్థ్య వచోబలమ్ము లిడు మయ్యా దేవ! సర్వేశ్వరా

జను లన్యోన్య హితాభిలాషులయి సౌజన్యాత్త సౌభ్రాత్రముల్
దనరన్ శాంతిసుఖోన్నతుల్ కలిగి కళ్యాణ ప్రమోదమ్ములన్
వినుతాధ్యాత్మిక ధర్మజీవన కళా విఖ్యాత చారిత్రులై
మనునట్లున్ దయజూడు మయ్య పరమాత్మా! దేవ సర్వేశ్వరా!

తొలగుంగాత విరోధభావయుత వృత్తుల్ జాతిమధ్యంబులన్,
కలుగుంగావుత శాంతిసౌఖ్యములు, లోకంబెల్ల సంతృప్తిమై
మెలగుంగాత, మనుష్యజీవితము కూర్మిన్ దైవసామ్రాజ్యమై
వెలుగుంగాత చిరమ్ము తావక కృపావిర్భూతి సర్వేశ్వరా!

* * * * *

నీరేజప్రసవార్ద్రకోమలము, కొండేపూడివంశ్యుండు సు
బ్బారాయాఖ్యుడు నీదుభక్తుడు రచింపన్ నీపదస్తోత్రమా
లారమ్యోజ్జ్వల మిద్ది; పాఠకుల కెల్లన్ కల్గుతన్ నీకృపా
పారమ్యామృత భాగధేయ మగు సంపత్సిద్ధి సర్వేశ్వరా!

ఓం తత్ సత్



# శ్రీ కొండేపూడి సుబ్బారావు

## ఇతర రచనలు

ముద్రితములు

1. గీతామృతము : 1/8 డెమీ పుటలు 360. చక్కని త్రివర్ణ ముఖ చిత్రముతో ముద్రింపబడినది. వెల సాదా ప్రతి రు. 12-00 లు. లైబ్రరీ ప్రతి రు. 15-00 లు.
   శ్రీమద్భగవద్గీతకు మూలానుసారమగు తెలుగు అనువాదము. మూల శ్లోకముతో సహా ప్రతి శ్లోకమునకు పద్యతాత్పర్యములు, ప్రతి అధ్యాయమునకు వేఱుగా సారాంశము, భగవద్గీత – సాంఘిక జీవనము అను ప్రత్యేక వ్యాసమును ఇందు కలవు. మధురమగు సులభశైలిలో వ్రాయ బడి పాఠకుల కెల్లరకు సుబోధకము, అత్యంత ఉపయోగకరమగు అమృత తుల్యమైన గ్రంథమని పలువురు పండితులచే ప్రశంసింప బడినది.

2. గీతా సంగ్రహము : 1/8 డెమీ. పుటలు 48 వెల రు 2-00 లు.
   శ్రీమద్భగవద్గీత పదునెన్మిది అధ్యాయముల సారము సులభ శైలి వచనమున వ్రాయబడిన గ్రంథము. గీతాతత్త్వమును సంగ్రహముగ తెలిసికొనుటకు అత్యంత ఉపయుక్తమైనది.

3. కావ్యాంజలి : 1/8 క్రౌను. పుటలు 100. వెల రు 3-50 లు.
   ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారి ఆర్థికసహాయము లభించిన గ్రంథము. సుప్రసిద్ధ విద్వత్కవులు సర్వశ్రీ విశ్వనాథ, ఎమ్. ఆర్. అప్పారావు, రాయప్రోలు, మధునాపంతుల, గంటి జోగి సోమయాజి, వేంకటావధాని, యస్వీ జోగారావు, పురిపండా, నారాయణరెడ్డి మున్నగు పలువురి చేతను, భారతి మున్నగు సాహిత్య పత్రిక లందును ప్రశంసింప బడిన రమణీయ పద్యకావ్య సంపుటి.

అముద్రితములు

మేఘసందేశము (తెనుగు అనువాదము), చిట్టితల్లి, కవితాలహరి, సాహిత్య సౌరభము మొదలగునవి.